# శ్రీ రామనామశతకము.



శ్రీ వంకాయల అప్పలనృసింహ

భక్త ప్రణీతము.

విశాఖపట్టణమునందలి

శ్రీశారదామకుట ముద్రాక్షరశాలలో

ముద్రింపించి ప్రచురింపబడినది.



1924.



(PRESS.)



శ్రీరస్తు.

# శ్రీరామనామ శతకము.

క॥ ముందుగ గజవదనుని నే। పొందుగ పూజించి మదిని పొలుపారంగా। వందనము జేసి గొలచెద। సందేహము లేక బ్రోవు సద్గుణరామా॥ ౧॥

క॥ వందనము జేతుభారతి। వందనము త్రిలోకజనని వందనమమ్మా। వందనము దివ్యసుందరి। వందనమిదె నన్ను బ్రోవు వైభవరామా॥ ౨॥

క॥ సోమకు ద్రుంచి వేదములు। ప్రేమతో బ్రహ్మకును సమర్పించితివిగదా। వేమరు నుతిజేసెద శ్రీ। రామ జనక నన్ను గావు కరుణనురామా॥ ౩॥

క॥ కూర్మపురూపు ధరించియు। నిర్మలమగు నీమనంబునన్ ఈ ధరంబున్। మర్మము లేకను మూపున। ధర్మవసన యెత్తితౌర భార్గవరామా॥ ౪॥

క॥ సూకర రూపముదాల్చియు। చీకాకు నొనర్చి వ
రహిరణ్యాక్షుని వధింపన్। చేకొని గావించితి వో।రాకరు
ణించి బ్రోవరా రఘురామా॥ ౫॥

క॥ కశ్యపుని వధించుటకు న। వశ్యముగా నరుడవ
గుచు నాప్రహ్లాదున్। నిశ్చయము గాచి మోక్షము।
ఆశ్రయము నటంచు నొసగితో శ్రీరామా॥ ౬॥

క॥ వసుధను మూడడుగులు బలి। నొసగుమని బ్ర
తిగ్రహించి వసుధాధీశా। అసమ బలుండవు యగుచు
ను। కసిదీరగ ద్రొక్కితెర కౌస్తుభ రామా॥ ౭॥

క॥ దశరథపుత్రుడవగుచును। దశకంఠుని ద్రుంచి లంక
దానంబియవే। మసలక విభీషణునకును। దశదిశలను కీ
ర్తి వెలయ దశరథ రామా॥ ౮॥

క॥ ఇరువది యొకమారును భూ। వరులను సమ
యించితౌర స్థిరమతితోడన్। వర పరశురామ నిను వే।
మరు నుతి జేసి గొల్తు మరువక రామా॥ ౯॥

క॥ ధీరుడ బలరాముడవై। కోరికతో గోపికలను
గూడితివౌరా। సారెకు నిను వేడితిగద। భారమునక బ్రో
వవయ్య భార్గవరామా॥ ౧౦॥

క॥ బుద్ధియశుండవునగు వో। శ్రౌద్ధ జగన్నాథము
ననుమేల్ భక్తి భోగములన్। నద్దిక మీరగ గోరిన। పృథ్వీ
పతి నన్ను కరుణబ్రోవుము రామా॥ ౧౧॥

క॥ కలికావతారమున మేల్ । కలియుగమున నీకు మాయుగానర జనులున్ । భళి జాతిభేదమేమియు। సలలితముగ లేవుగదర సద్గుణరామా॥ ౧౨॥

క॥ దశవిధముల నినుదలచుచు । పశుపతి వందన మొనర్చు పరమదయాళో। వశమై వరముల నొసగుము। వసుదేవకుమార మాధవా శ్రీరామా॥ ౧౩॥

క॥ కందములుజెప్పి శ్రీయదు। నందన సమర్పణము జేతు సమ్మతముగ గో। విందా గైకొని మోక్షము। నందముగ నొసంగి బ్రోవు నరహరిరామా॥ ౧౪॥

క॥ శ్రీరామరామయనిమది । గోరి నినున్ గొలతు మోక్షకామ్యార్థుడనై। మేరునగధీర బ్రోవర। శ్రీరమణీ మనోభిరామ శ్రీరఘురామా॥ ౧౫॥

క॥ ఏకే నీసరిదైవము । లేకే భువిలోనజూడ లేరుగదర వో। సాకన పత్రార్థిణనిన్। సారెకు భజియింతు నౌర సద్గుణరామా॥ ౧౬॥

క॥ ఓభద్రాద్రీశ్వరయని । నాభావమునందు దలతు నగధర వినుమా। ప్రాభవమొందగ సురర। క్షాభావజ జనకరార యచ్యుతరామా॥ ౧౭॥

క॥ ఇలలో నీనామంబును । సలలితముగ దలచినట్టి సద్భక్తులకున్। గల్గును యిహపర సౌఖ్యము । కలియుగమున స్మరణకాదె కౌస్తుభరామా॥ ౧౮॥

క॥ లేదా నాపైనీదయ। రాదా నీకరుణ జూపరాధా
వాదా। యేదారిదోచకను నీ। పాదంబులు గొలుతు ప
తితపావనరామా॥ ౧౯॥

క॥ ఏమీ బిలచిన బలుక వ। దేమీ నావల్ల నేర
మేమో చెపుమా। సామజ వరదా నీవగు। మోమైనా
జూపరాద మోహనరామా॥ ౨౦॥

క॥ సారవిహీనంబగు సం। సారాబ్ధిని గడువలేక సా
రెకు నిను నే। కోరిభజింతి విని నా। నేరము లెన్నకను
బ్రోవు నెనరున రామా॥ ౨౧॥

క॥ కీరమును బెంచి ముద్దుల। నారీమణియొక తె భ
క్తి నోరా రామా। పేరున బిలచిన గొబ్బున। తారక
ము నొసంగి గాచితౌరా రామా॥ ౨౨॥

క॥ అలనాడు శబరియెంగిలి। ఫలములు దెచ్చివ్వ
మెచ్చి భక్షింపుచు నా। లలనకు మోక్షమొసగితివి। వ
లసితముగ నీదుకీర్తి వెలయగ రామా॥ ౨౩॥

క॥ నిరుపేద కుచేలుడు యే। తెరగును వృథుకము
ల నివ్వ దెమ్మనుచు మహా। కరుణతో భుజియించియు
మేల్। సిరుల నొసగి బ్రోచితౌర శ్రీరఘురామా॥ ౨౪॥

క॥ ఇంద్రుండు శిలలవరుషము। పొందుగ గురియిం
ప గోపసుందరులను గో। బృందములు రక్షణార్థము। మం
దరమును నొక్క వ్రేల్న ధరించిన రామా॥ ౨౫॥

క॥ వారధి బంధించుట కా । వాలిని వధియించి సు
గ్రీవాదులతోడన్। ధీయుడ స్నేహమొనర్చవె। సారన వ
తాౢక్ష సర్వసముడవు రామా॥ ౨౬

క॥ నీమమునుగలవారలమని । నామంబులుదిద్ది ఫలు
లు వయు మొందర రెయో। నీమహిమగాన జాలక । సోమ
రి కతనంబుచేత సోలును రామా॥ ౨౭॥

క॥ పామరుడను జెముడను నీ। నామమె గతియం
చునమ్మి నామనమందున్। వేమరు స్మరియించెద నో।
దామోదర కేశవా ధనంజయరామా॥ ౨౮॥

క॥ దానజనులలో నొకనిగ । జేసి కృపన్ మోక్ష
పదవి జేర్చెదవంచున్ । ఆశించి నమస్కారము । జేసె
ద దయజూడుమయ్య జేజేరామా॥ ౨౯॥

క॥ ఎందుకు దయజూడవు గో। విందా నాయందు
కోపమెందుకు నాహృ। న్మందిరమున వసియింపుచు।
మందరధర నన్నుగావుమా రఘురామా॥ ౩౦॥

క॥ నీతండ్రియగు దశరథుడు । నీతమ్మునితోడ నీ
దుసతితోడుత నం । ప్రీతిని యడవులపాలుగ । చేతో
మోదంబుతోడ జేయడె రామా॥ ౩౧॥

క॥ రంగగు నీనామంబును । పొంగుచు నాయాత్మ
తమును పొందుట కొరకై । గంగా రంగా యనుచు ను।
ఛాంగా భజియింతు వెన్నదొంగా రామా॥ ౩౨॥

క॥ ఓ పతితపావనుడ నా । పాపము వెడలిమ్ము మ్మిం
చు ప్రార్థించెద నా। ప్రాపును దాపును నీవై। గూావదల
ను బాపుమయ్య అచ్యుత రామా॥ ౩౩॥

క॥ ఖగవాహన మధుసూదన। పగవాడనుగాను భ
క్త పరివారములో । నొకనిక జేకొని అభయము । వ
గణితముగ నొసగి గావు హరి శ్రీరామా। ౩౪।

క॥ తావక పాదపద్మములు । సేవించి మదీయహృ
దయభావమునందున్ । నీవేగతియని దలచుచు। నేవేళ
ల స్మరణ జేతు నెనరున రామా॥ ౩౫॥

క। ఎన్నో విధముల నినునే । సన్నుతులను జేయు
చుంటి సత్కరుణనిధీ। పన్నగశయనా ఏదగు । చిన్ని
కృపన్ జూచిబ్రోవు శ్రీరఘురామా॥ ౩౬॥

క॥ వారిజసంభవ నినువే। మూారును బిలచినను బ
లుకవేరం మేరా। వేరా తేరా నీదయ పారావారము
గ నొసగు పావనరామా॥ ౩౭॥

క॥ శరణన్న మాత్రమున నా। కరిరాజును గాచినట్టి
ఘనుడవు నీవా। తెరగున నన్నేలిన నీ। బిరుదదేయని
బొగడుచుందు భీకర రామా॥ ౩౮॥

క। కావుమనుచు కాకాసురు। డావేళను వేడ మది
ని హర్షముతోడన్ । దేవర వరములొసగితివి। భావ
మునన్ గొలతు భక్తపాలన రామా॥ ౩౯॥

క॥ కలకాలము నీవే నా । యిలవేల్పువటంచు నిశ్చ
యించుచు మదిలో॥ దలచుచు బిలచితి బలుకవె। తుల
సీదళధామ పన్నుతులుగొనురామా॥ ౨౦॥

క॥ జపములు సేయ నశక్తుడ । నపరాధిని చపలమ
తిని అతిపామరుడన్। కృపజూచి గావవే యీ॥ నెపము
ల నెన్నకను నన్ను నెనరున రామా॥ ౨౧॥

క॥ యాత్రలు దిరుగగ జాలను । గాత్రిసుతధవుక
నిన్ను సుస్థిరమతితో । స్తోత్రము జేసితి నభయము । కీ
ర్తిన్ వెలయంగ నొసగ కర్త వురామా॥ ౨౨॥

క॥ తపములు జపములు జన్నము । లపరిమితము జే
సినట్టి యార్యులకెల్లన్। సఫలముగ స్వర్గపదవులు। కృప
జూచి యొసంగితౌర గొబ్బున రామా॥ ౨౩॥

క॥ దేవాదిదేవ నీపద। సేవకుడను నన్ను గావ లేవా
రావా । వేవిధముల నినుగొలచెద । నావెతలను బాపు
వాసుదేవా రామా॥ ౨౪॥

క॥ నీవేగతి యనుచును నా । భావమున దలంచు
చుంటి పలువిధముల నే। భావజజనకా గావుము। శ్రీవర
నీవాడగాన శ్రీరఘురామా॥ ౨౫॥

క॥ ఉల్లానము మీరంగ న । హల్యాశాపమును బా
పి యజ్ఞంబును సా । ఫల్యముగ గాచి కీర్తియు । ముల్లో
కములందు వెలయ మురహరరామా॥ ౨౬॥

క॥ తల్లివి దండ్రివి నీవని । యుల్లములో నమ్మి గొ
లచు చుంటిని గద నీ । చల్లని కృపనాపై వెద । జల్లి ద
యగ బ్రోవుమయ్య జానకిరామా॥ ౪౭॥

క॥ నీదు పదపద్మయుగళియు । మోదముతో పూ
జజేతు ముద మొదవగ న । న్నాదరణజేసి గావవె । శ్రీ
ధర ఆశ్రితుడగాన శ్రీరఘురామా॥ ౪౮॥

క॥ మానిని యాద్రౌపది యభి। మానము గాచుట
కు నీదు మనమున ప్రీతిన్। బూని దయ నక్షయముగా।
చీనాంబరములను యొసగితౌ శ్రీరామా॥ ౪౯॥

క॥ అరమర లేటికి వినుమో। పరమపురుష భక్తపా
ల పాపవినాశా । మరిమరి వేడితిగద నా। మరితములను
బాపి బ్రోవు నరహరిరామా॥౫౦॥

క॥ఇలలో నీదగునామము। స్మరియించుట యిహ ప
రంబు సాధనమనుచున్। దలచుచు భజియించెద నా ।
యిల వేల్పనటంచు నెంచి యినకులరామా॥ ౫౧॥

క॥ భళి నీనామరసమురుచి । దలపంగా ఇక్షురస
ముతులదూగదటం। చెలిమితో గ్రోలుచు నుంటిని । క
లకాలము కరుణజూడు కౌస్తుభరామా॥ ౫౨॥

క॥ మానవజన్మము యెత్తియు । జ్ఞానము వచ్చిన
ది మొదలుగా మనముననిన్। ధ్యానమున గొలచెదను
అభి। మానంబున కోర్కెలొసగుమా శ్రీరామా॥ ౫౩॥

క॥ జన్మములలోన మానవ। జన్మంబే ముఖ్యమగు జ
గతిని ద్విజుడై। జన్మించి నిన్ను గొలచే। జన్మకు ఇహప
రసుఖంబు జెందడే రామా॥ ౪౩॥

క॥ ఎప్పుడుదయ గల్గును శ్రీ। యఃపతి ప్రార్థించుచుం
టి నెలమితో వినుమా। యప్పాఅభయమొసంగ వేడ్పే
మియు జేశితౌర దశరథరామా॥ ౪౪॥

క॥ శ్రీహరియని నిను బిలచిన। నోహోయని బలు
కరాదె యోపరమాత్మా। చహాభాసు నీదు మహిమలు। వ
హ్వా నెన్నుటకు నావశంబా రామా॥ ౪౫॥

క॥ తొలిజన్మంబున యేనో। ములు నోచితో సందు
వలన మనుజుడనైనా। నళినవలె నీపదపంకజముల నన్యా
తము గొల్చుచుందు మురహరిరామా॥ ౪౬॥

క॥ నీనామసుధారసమును। నానాలుక కెంతో సుధు
రమై నలరెను గా। చీనీశర్కర క్షీరము। లైనా సరిరావు క్షీ
రశయనా రామా॥ ౪౭॥

క॥ అనఘచరిత్రా నీపదవనజములను మదిని నిలపి
వేయివేలును వందనములు జేసెద గైకొని మనమలరగ
బ్రోవవయ్య ఘునశ్రీరామా॥ ౪౮॥

క॥ కనికరము లేదనా పై। నిన కులరవికోటి తేజ యుహా
మందుని నన్। ఆనిశము కొనియాడెదనో జనకజపతి నన్ను
గావు జానకిరామా॥ ౫౦॥

క॥ కాకుత్స్థకులజసోమా। నాకాధిపవినుతరంగనా
యక నినునే। ప్రకటముగగొలచెదనో।శ్రీకర దరిశనము
సంగు శ్రీరఘురామా॥ ౬౧॥

క॥ కన్నకుమారునివలెనే। విన్నపములు జేయుచుం
టి విఖ్యాతనిధీ। నన్నేమరకనుబ్రోవుము। అన్నెమెరుగ
నిన్నెగొలుతు హరిశ్రీరామా॥ ౬౨॥

క॥ కలనైన యితరులనునే। గొలువంగా లేదుమదిని
గొలచెదనిన్నే। పలుమారు దలచుచు వేడెద। నలరారగ
వరములొసగు నరహరిరామా॥ ౬౩॥

క॥ దాతవనుచునామనమున। నాతురుతను జెంది మి
గుల యాచించితినో। దాతా మోక్షమొసంగవె। నాత
ప్పులుగాచి మోహనా శ్రీరామా॥ ౬౪॥

క॥ ధనమునకు నాసజెందుచు। మనమున నినుబొగడ
లేదు మనుజాధీశా। ననిశము నభయముకొరకై। గొని
యాడెద కోర్కెలొసగు ఘనశ్రీరామా॥ ౬౫॥

క॥ పావనచరితా నినునా। భావంబుననిలిపిగొలతు
పరిపరిగతులన్।నా వెతల బాపి గావుము। దేవ మహాదేవ
వాసుదేవా రామా॥ ౬౬॥

క॥ సురలకు నసురులకును నొక। సరిగానమృతంబు
బంచుకొరకై నీవున్। పరమాత్మ మోహినీవై పరిపరి
గతుల విభజించి పంచవె రామా॥ ౬౭॥

క॥ ఏ వేల్పుదలచి మ్రొక్కిన । నీవేయని మదినిదల
చి నిశ్చయముగనే। భావించి సన్నుతించెద। గోవర్ధనధారి
నన్ను గావవె రామా॥ ౧౮॥

క॥ గాండీవికి సారథివై । పాండవులను గాచినట్టిప్ర
భుడవు నీవా। మెండైనకర్ణుబట్టియు। ఖండించవె తుని
యలుగను ఘన శ్రీరామా॥ ౧౯॥

క॥ గోపికలగృహంబులకును । నేపారగనేగి పాలువె
న్నయుజున్నున్। శ్రీపతిభుజియింపుచు నా । పాపికంసు
ప్రాణములను బాపవె రామా॥ ౨౦॥

క॥ అపవాదుబాపుకొనుటకు । నెపమునజాంబవుని
గెల్చి శశ్యమగత్నంబున్ ।క్రుపచేగైకొనుచునునా। చప
లచిత్తుసత్రాజిత్తు జేర్చవె రామా॥ ౨౧॥

క॥ వేమారుగొలతురఘుకుల । సోమా శ్యామాభి
రామ సుగుణస్తోమా । ప్రేమాభిమాన మునివర । ధీ
మా ధామాసకను శ్రీరమాపతి రామా॥ ౨౨॥

క॥ శరణాగతవత్సలుడను । బిరుదువహించియును
భక్త పరివారములన్ । దురితముల బాపిగాపుము । పర
మాత్మా పరమపురుష మురహరిరామా॥ ౨౩॥

క॥ శంఖముచక్రము బట్టిన। వంకనైనసీదు భక్తవ
రులను దయతో । శంకయులెకను బ్రోవవె। పంకజదళ
నయన భక్తపాలనరామా॥ ౨౪॥

క॥ మునులందరు నినుమనమున। గొనియాడిన నీమ
హిమ కనికరము దవన్। వనితలు గండ్ర వరించెదనని
వరము లొసగితౌర ఘనశ్రీరామా॥ ౨౫॥

క॥ ఎందరొ మాతృపితురులయి। రెందరొ కాగల్గు
వారొ। యెందుకు మాయాబంధకములు గల్పించెదో।
సందేహముమాన్పి దయనొసంగవె రామా॥ ౨౬॥

క॥ శ్రీయుతమూర్తి ప్రపంచపు। మాయయనెడి తె
రనుగట్టి మనుజులనెల్లన్। వేవిధములనాడిస్తివి। యీయ
డబహుసూత్రధారివై శ్రీరామా॥ ౨౭॥

నారదుడు నీమాయను। నారీరూపంబుదాల్చి న
రువదిపుత్రుల్। తీరుగగనినీకరుణను వేరులిడెను వత్స
రముల పేరును రామా॥ ౨౮॥

క॥ మునిపల్లెనాడగోరిన జనకజ నొంటిగను వనము
జేర్చితివసటా। మునియాశ్రమమును జేరియు। కనియన్
యుగపుగను పుత్రులను శ్రీరామా॥ ౨౯॥

క॥ పుత్రులగని మోదముతో। ధాత్రినుతబెంచి భిక్ష
యాత్రకు బంపన్। క్షేత్రజ్ఞులునీపురికిని। ఆత్మతతో జే
రిరయ్యా హరిశ్రీరామా॥ ౩౦॥

క॥ కుశలవులు నీదుచారితము। విశదంబుగవిన్నవింప
విని మనము దయా। రసమొంది జేరబిలచియు। పశిబా
లురిమ స్టసగొనవె ఘాస్త్రప రామా॥ ౩౧॥

క॥ అస్ఖలితబ్రహ్మచారివి । నిష్కళంకమానసుడ
వు నిష్కామ్యుడ శ్రీ । యుస్కరమైన మోక్షపదవిని ।
భాస్కరవంశజ నొసంగు భాగ్గవరామా॥ ౧౩॥

క॥ రాయని అనుమాత్రము చే। బాయును లోనున్న
పాపభయము దమపరన్ । మాయని యధరము మూశిన।
హాయను వైకుంఠపదవి నొందును రామా॥ ౧౪॥

క॥ సనకసనందనులను ముని। గణములు నినుమానము
నందు గొనియాడిన నా। ఘనులకు నభయము నొసగితివి।
ననుగావుట నీకెదె తపని శ్రీరామా॥ ౧౫॥

క॥ సచ్చరితుడ వీవంచును । నిశ్చింతితో నమ్మి మది
ని నినుగొలచెద నా। స్వేచ్ఛగ వరముల నొసగుము । ని
శ్చలత మతుండవగుచు నిసకులరామా॥ ౧౬॥

క॥ రామాయను బీజము ను । నామామనక్షేత్రి
మందు నాటించెద నా। కామిత ఫలము ఫలించియు ।
మామకభీష్టము లొసగుమా శ్రీరామా॥ ౧౭॥

క॥ నిత్యము నీపూజను నే । సత్యముగా షోడశోప
చారంబులతో । నిత్యోత్సవముగ జేసెద ప్రీత్యర్థంబగు
చు బ్రోవుప్రేమను రామా॥ ౧౮॥

క॥ దేవా నీదాసుని గైకోవా । నేకోరు వరము లీ
వా రావా। నేమేల నీదుపదములు। భావమునన్ గొల
తు పతితపావనరామా। ౧౯।

క॥ ఆపన్నివారణానా । పాపము లెడజిమ్మ్ మంచు పలువిధములుగా। నీపాద సేవ జేసెద। నాపాలిటివేల్పు లక్ష్మీనాయక రామా॥ ౯౦॥

క॥ ఎంతోచనవరి ననినా । చింతలుడిగినీదు చెంత జేర్పుమటంచుఁ । మంతెనమున బ్రార్థించెద నంత రాత్రి పంతమేర హరి శ్రీరామా॥ ౯౧॥

క॥ రా యని దెరచిననోరును।మూయనుచును మూసి అందు మధురామృతమున్ । హాయిగ గ్రోలిన మనుజుడు। శ్రేయస్కర మోక్షపదపి జెందడె రామా॥ ౯౨॥

క॥ దేవర గొనియాడెదనను । గావరవరముల నొసంగి గాంచ మొప్పన్। నీవేగతి యనినమ్మితి । శ్రీవర కరుణించరావె శ్రీరఘురామా॥ ౯౩॥

క॥ అగణిత సత్యభాషుడవు। సుగుణమణి విరాజమానసుజ్ఞానివిగా। ఎగరావె నన్ను కరుణను। జగతికె నిను బొగడుచుందు జానకిరామా॥ ౯౪॥

క॥ యేదయ నీదయన్నాపై। రాదా నామీద యాది లేదావాదా। మోహమున మోక్షమొసగుము। శ్రీధర భేదంబదేల శ్రీరఘురామా॥ ౯౫॥

క॥ సదయుఁడ మానసమున నిత్యముగా। వనజములు సేవిం
చుచుంటి భక్తి ననిశమున్। ముదమొదవగ నను పదవ
డి। వదలక కైవల్యపదవు నొసగుము రామా॥ ౯౬॥

క॥ అనుమానమేల మనవిని। గొనుమా నా విన్నపం
బులును మాటికినీ। వినువినుచు దయారసమును। అణు
మాత్రంబైన నొసగు అచ్యుతరామా॥ ౯౭॥

క॥ యేమి ప్రయోజనమో నీ। నామము దలచక
ను హీన నరులను గొల్వన్। కామితఫలమా మోక్షము।
రామా తెలియంగలేరురా శ్రీరామా॥ ౯౮॥

క॥ నిను వేడెద నను బాయకు। అనుదినమును మన
మునందు గొనియాడెద నా। మనవిని వినుచును నభయ
ములను గొసంగుమని యొసగరాదె ఘనశ్రీరామా॥ ౯౯॥

క॥ నేజేయు మనవి నొక్కటి। నీ చెవియొగ్గుచును వి
నుచు నీమనమందున్। దాచక నీప్సితమొసగవె। వా
చాళత మేల మాధవా శ్రీరామా॥ ౧౦౦॥

క॥ మద్దిలతాళము గొనుచు। ముద్దేకర వీవటంచు
మది నమ్ముచు నిన్। ముద్దుగ బాడుచునాడుచు నిర్దేశ
ములందు పాటుదును శ్రీరామా॥ ౧౦౧॥

క॥ చదువంగ లేదు సమరము । ముదమున నాంధ్రి
మును కావ్యమును లక్షణమున్। చదువంగ లేదు నిన్నే
చదివిన చదువంచు నెంచి చదివితి రామా॥ ౧౦౨॥

క॥ వరదుడు గురునాథునకును । వరపుత్త్రుడు నప్ప
నాఖ్య పరునకు నేనున్। సురుచిరముగ జెన్మించితి। వర
దా నన్నొకని బ్రోవుటరుదా రామా॥ ౧౦౩॥

క॥ శంక నొకింతయు లేకను । వంకాయల అప్పలా
నృశింహాఖ్యుని బ్రోవన్। పొంకముగను నీకేదగు పం
కజాక్ష దాసజనులపాలన రామా॥ ౧౦౪॥

క॥ చెప్పితి శతకమునీపై । నొప్పుగ కృతియుంచి మం
చి నెనరున నిందున్। తప్పులు గల్గినక్షమగొను। మప్పా
యిప్పాపునంమునప్పా రామా॥ ౧౦౫॥

క॥ శ్రీరాము నామశతకము । కోరికతో నాదు శక్తి
కొలదిని చెపితిన్। సారమతులెవరు చదివిన। శ్రీరమణు
డొసంగు సిరులు శీఘ్రము రామా॥ ౧౦౬॥

క॥ మంగళమునీకు గరుడ తు । రంగా శ్రీమచ్ఛు
భాంగ రంగోత్తుంగా । అంగజ జనకాకె పురపు । మంగ
ళహారతి దెగొనుము మాశ్రీరామా।

గద్య। ఇతి శ్రీమద్రమారమణ చరణ సేవాసమాసాదిత
వీక్షణ ప్రసాదలబ్ధ కవిత్వ వైఖరీ శ్రీకరాశ్వ లాయనసూ
త్ర శ్రీమదాత్రేయసగోత్రపవిత్రసుజనమిత్రవిద్వజ్జనా
దరణపాత్ర శ్రీమద్వ్యంకాయలవంశ పయఃపారా
వార రాకాసుధాకర శ్రీమద్గురునాథ పౌత్ర
అప్పనాఖ్య వరపుత్ర సుగుణ కదంబ శ్రీ
చాయమాంబ గర్భశుక్తి ముక్తాఫల
సుకవి జనవిధేయ శ్రీమదప్పల
నృసింహ భక్త నామధేయ
ప్రణీతంబైన శ్రీరామ
నామశతకంబను తె
నుగు కంద ప
ద్యంబులు
సంపూర్ణము.
శ్రీ రామార్పణమస్తు.

రౌద్రినామసం॥ర కార్తీక బ౧౧ యిందువాసరము.

